సమాధానము—విద్వత్సన్న్యాసము ప్రతిపత్తికర్మవలె లౌకికవైదికరూపములు రెండును కలిగియున్నందున దురనుష్ఠేయము కాదు అది యెట్లనఁగా నిట్లు వివరించెదము.

జ్యోతిష్టోమయాగమునందు దీక్షను బొందిన యజమానునకు దీక్షాంగములైన నియమములను అనుష్ఠించు కాలమునందు కండూయనార్థము హస్తము నిషేధింపఁబడి కృష్ణమృగవిషాణము (లేడికొమ్ము) విధింపఁబడినది. దీక్ష సమాప్తి నొందినతరువాత కృష్ణమృగవిషాణముతోఁ బ్రయోజనము లేనందున నా కృష్ణమృగవిషాణమునకుఁ బరిత్యాగము స్వయముగానే యేర్పడినది. ఇట్టి స్వతస్సిద్ధమైన త్యాగమును, శ్రు. *'నీచాం దక్షిణాసు చాత్వాలే కృష్ణవిషాణాం ప్రాస్యతి' అనుశ్రుతి విధించుచున్నది. చాత్వాలమునందు కృష్ణమృగవిషాణత్యాగమనెడి యీకర్మ ప్రతిపత్తికర్మ యనఁబడును. ఇది వేదవిహితమైనందున వైదికముగాను స్వతఃప్రాప్తమయినందున లౌకికముగాను నున్నది. ఈప్రకారమే విద్వత్సన్న్యాసముకూడ శాస్త్రవిహితమైయునందున శాస్త్రీయమని స్వతః ప్రాప్తమయినందున లౌకికమని చెప్పఁబడి యుభయరూపముగా నున్నదిగనుక ప్రతిపత్తి సులభముగా ననుష్ఠింపఁదగియున్నది.

* యజమానునిచే నుపయోగింపఁబడిన దక్షిణలను ఋత్విక్కులు గ్రహించిన తరువాత యజమానుఁడు తనచేత నున్న కృష్ణమృగశృంగమును చాత్వాలమను గుంటలో పడవేయవలెనని శ్రుత్యర్థము. చాత్వాల మనఁగా యజ్ఞ సమయమున త్రవ్వించిన గోయి.

ఇదిగాక చిదాత్మయం దవిద్యచే నారోపింపఁబడిన కర్తృత్వము విద్యచేత నివర్తింపఁబడినప్పటికి చిదాభాససహితమయి యనేకమాత్రవికారములతో నిప్పటికిని కూడియున్న అంతఃకరణోపాధియందు వ్యవస్థితమయియున్న కర్తృత్వము అంతఃకరణము ఉండునంతను నుండు స్వభావము గలది గనుక తత్త్వవేత్తలయందు కర్తృత్వము సుతరాం నివర్తించు నని శంకింపఁదగదు.

ఆక్షేపము.—ఓయీ గ్రంథకారుఁడు తత్త్వవేత్తకు కర్తృత్వము కొంచెముగా నుండు నని చెప్పితే 'జ్ఞానామృతేన తృప్తస్య' అను స్మృతివచనము విరోధించును. ఆ వచనమందు తత్త్వవేత్తకు కర్తృత్వాంశము కొంచెమైనను లేదని కదా చెప్పియున్నది.

సమాధానము—ప్రవృత్తవిద్వత్సన్యాసాధికారికి తత్త్వజ్ఞానము కలిగియున్నప్పటికిని చిత్తవిశ్రాంతి లేకపోవుటచేత తృప్తియుండదు గనుక చిత్తవిశ్రాంతి పొందువరకు కర్తవ్యాంశము కలిగి యున్నందున కృతకృత్యత్వము సంపూర్ణముగా లేదు గనుకనే విద్వత్సన్యాసాధికారికి కర్తవ్యము కొంచెముగాఁ గల దని చెప్పినది. 'జ్ఞానామృతేన తృప్తస్య' అనుస్మృతివచనము పంచమషష్ఠసప్తమభూమికలయందున్న తత్త్వవేత్తల నుద్దేశించి ప్రవర్తించినది గాని విద్వత్సన్యాసాధికారిగా నుండు చతుర్థభూమికానిష్ఠునివిషయమయి ప్రవర్తించినది కాదు గనుక విరోధము లేదు.

ఆక్షేపము.—ఓయీ! తత్త్వవేత్తకు కూడ విధిబద్ధత కల దని చెప్పితే విధిజన్యమయిన అపూర్వమువలన జన్మాంతరము కూడ సంభవించును. అనఁగా శ్రు. 'అహరహస్సంధ్యాముపాసీత' యావజ్జీవ మగ్నిహోత్రం 'జుహోతి' ఇత్యాది విధివాక్యముల ననుసరించి చేయఁబడు సంధ్యావందనాగ్నిహోత్రాది కర్మలవలన సంభవించు పుణ్యమువలన జన్మాంతరము కలుగు నని భావము.

సమాధానము.—విధిననుసరించి తత్త్వవేత్తలచేత చేయఁబడు నిత్యనైమిత్తికకర్మలవలన నపూర్వము పుట్టును గాని ఆ యపూర్వమునకు జన్మాంతరము ఫలము కానేరదు. చిత్తవిశ్రాంతికి ప్రతిబంధకము లైన పాపములను నివారించుటయే ఫలము. కర్మకుఁ గాని కర్మజన్యాపూర్వమునకుఁ గాని ప్రత్యక్షఫలము సిద్ధించుచుండఁగా అప్రత్యక్షఫలమును కల్పింపఁదగదని న్యాయవేత్తలు చెప్పుచున్నారుగనుకనే 'వ్రీహీనవహన్యాత్' అనువాక్యమునందు అవహననమును(దంచుటయను) కర్మకు ప్రత్యక్షమయిన తండుల సంపాదనమే (బియ్యమును జేయుటయే) ఫలము గాని అగ్నిహోత్రాది కర్మలకు వలె అప్రత్యక్షమయిన స్వర్గాదులు ఫలము కావని చెప్పియున్నది. 'అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవతద్దర్శనాత్' అనుసూత్రమందీయర్థమువిస్పష్టముగా చెప్పఁబడియున్నది. తత్త్వవేత్తవలన ననుష్ఠించఁబడు అగ్నిహోత్రాది కర్మలు తత్త్వజ్ఞానము నేఫలమును కలుగఁ జేయునో అఫలము నే కలుగఁజేయును గాని జన్మాంతరప్రాప్తి మొదలైన ఫలాంతరములను కలుగఁ జేయవని సూత్రార్థము. కనుక శ్రవణాదివిధి

జన్యమైన యపూర్వము జ్ఞానోత్పత్తిప్రతిబంధకములయిన పాపములను నివారించి యేప్రకారము తత్త్వజ్ఞానమును గలుగఁజేయునో, జన్మాంతరమును గలుగఁజేయదో, యాప్రకారమే శిఖాయజ్ఞోపవీతత్యాగాదివిధిజన్యమైన యపూర్వముకూడ చిత్తవిశ్రాంతిప్రతిబంధములను నివారించి చిత్తవిశ్రాంతిని కలుగఁజేయును గాని జన్మాంతరమును గలుగఁజేయదు.

కనుక విధిని సంబంధించినప్పటికి దోషము లేనందున తత్త్వజ్ఞానేచ్ఛవలన సన్యసించుగృహస్థునివలె తత్త్వజ్ఞానము గలిగి సన్యసించు గృహస్థుఁడును నాందీముఖశ్రాద్ధము ఉపవాసము జాగరణము మొదలయిన విధుల ననుసరించియే సన్యసింపవలయును.

విచారింపఁగా విద్వత్సన్యాసమును విధించిన శాస్త్రము నందు నాందీముఖశ్రాద్ధాది ధర్మములను విధించి యుండలేదు. అయినా, యీవిద్వత్సన్యాసము వివిదిషాసన్యాసముయొక్క వికృతి అయినందున వివిదిషాసన్యాసములోఁ జెప్పిన యావద్ధర్మములు విద్వత్సన్యాసమునందు "ప్రకృతివద్వికృతిః కర్తవ్యా" అనున్యాయప్రకారము అతిదేశముచేత సంభవించును.

శ్రౌతకర్మలలో సర్వాంగములను ప్రతిపాదించి విధించిన కర్మలు ప్రకృతులని, కొన్ని అంగములనుమాత్రము ప్రతిపాదించి విధించిన కర్మలు వికృతు లని చెప్పఁబడును. అందులో నేకర్మ యేకర్మయొక్క వికృతిగా నుండునో ఆ ప్రకృతికర్మయొక్క ధర్మము లన్నియు వికృతికర్మలో ననుష్ఠేయములుగా ప్రాప్తించును.

ఇందుకు దృష్టాంతము.—దర్శపూర్ణమాసములలోని ఆగ్నే యయాగము ప్రకృతికర్మ. దీనియందు యాజమానాంగములు విధింపఁబడియున్నవి. శ్రు. *'సౌర్యం చరుం నిర్వపేద్బ్రహ్మవర్చసకామః' అను శ్రుతిచేత విధింపఁబడిన సౌర్యయాగము వికృతికర్మ. దీనియందు యాజమానాంగములు విధింపఁబడియుండలేదు. ద్రవ్య దేవతాఫలములు మూడుమాత్రము విధింపఁబడియున్నవి. ఇచ్చట †సౌర్యయాగము ఆగ్నేయయాగమువలె నాచరింపఁదగియున్నది. ఈయర్థము సూ. 'ఇతి ధర్మ్యజతేః పూర్వవత్త్వం' అను జైమినిసూత్రముచేఁ జెప్పఁబడియున్నది.

కనుక విధివాక్యమునందలి విద్యోపన్యాసమునందు 'పుత్రోత్పాదనసంధ్యాదికముగా పుత్రమిత్రాది త్యాగమును సంకల్పించవలయును' శ్రుతియందుఁగల బంధ్వాది శబ్దములలోని ఆదిశబ్దముచేత భృత్యులు పశువులు క్షేత్రములు గృహములు మొదలైన లౌకికవిషయములు చెప్పఁబడుచున్నవి. 'స్వాధ్యాయం చ' అను పదమందుఁగల చకారముచేత వేదార్థముల నిర్ణయించుటకు ఉపయుక్తములైన తర్క-వ్యాకరణ మీమాంసాశాస్త్రములు వేదోపబృంహణములగు నితి

* బ్రహ్మవర్చసమును గోరిన పురుషుఁడు సూర్యదేవత నుద్దేశించి చరుద్రవ్యముచేత యాగమును చేయవలయు నని శ్రుత్యర్థము.

† సౌర్యయాగములకు ప్రత్యేకముగా ననుష్ఠానక్రమమును బోధించనందున ప్రకృతికర్మము ఆగ్నేయయాగముయొక్క అనుష్ఠానక్రమమునే యంగీకరించవలయునని సూత్రార్థము.

హాసపురాణములును చెప్పబడుచున్నవి. లౌకికములైన పశుశా-స్త్రాదులను వేదాధ్యయనమును తర్క-వ్యాకరణ-మీమాంసా పురాణేతిహాసములను విడువవలయు నని తాత్పర్యము.

దోషయుక్తనిష్ప్రయోజనములుగా నున్న కావ్యనాటకాదుల యొక్క త్యాగము కైముతికన్యాయసిద్ధము. అనఁగా శాస్త్రవిహితములైన వేదవ్యాకరణాదికములనే త్యజింపవలసియుండఁగా* 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అని నిషేధింపఁబడిన కావ్యనాటకాదికమును త్యజింపవలయు నని చెప్పవలసినదే లేదని భావము.

'సర్వకర్మాణి' అనుపదమందుఁగల సర్వశబ్దముచేత లౌకికవైదికనిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధకర్మలన్నియు సంగ్రహింపఁబడుచున్నవి. పుత్రత్యాగముచేత ఐహికభోగవాంఛయు, సర్వకర్మత్యాగముచేత ఆముష్మికభోగవాంఛయును పరిహరింపఁబడినవి. ఈ రెండు వాంఛలు చిత్తమునకు విక్షేపమును కలుగఁజేయును కనుక త్యాజ్యములుగా నున్నవి. ఈ బ్రహ్మాండమును త్యజింపవలయునని చెప్పినందున బ్రహ్మాండాధికారప్రాపకమైన విరాడుపాసనమును విడువవలయు నని చెప్పఁబడినది. 'బ్రహ్మాండం చ' యనుచకారముచేత సూత్రాత్మప్రాప్తికారణమైన హిరణ్యగర్భోపాసనము తత్త్వజ్ఞానసాధనములైన శ్రవణాదులనుగూడ విడువవలయునని చెప్పఁబడిన ఐహికాముష్మికముల నన్నిఁటిని విడిచి కౌపీనమును దండమును కాషాయమును

*ఉద్యానక్రీడాస్త్రీకథాత్మకములైన కావ్యములను పఠింపఁ గూడదని స్మృతియొక్క తాత్పర్యము.

గ్రహింపవలయును. 'ఆచ్ఛాదనంచ' అనుపదమునం దున్న చకా
రము పాదుకలు మొదలగున వాటికొన్నింటిని గ్రహింపవచ్చు
నని తెలియఁజేయుచున్నది.

శ్లో. కౌపీనయుగళం వాసః కంథాం శీతనివారిణీం,
పాదుకే చాపి గృహ్ణీయాత్కుర్యాన్నాన్యస్య సంగ్రహం.

అనుస్మృతి యీయర్థమును వివరించుచున్నది.

తా. రెండు కౌపీనములను ఒక కాషాయవస్త్రమును
చలినివారించు బొంతను పాదుకలను గ్రహింపవలయును.
ఇంతకంటె నితరమైనవాటిని గ్రహింపఁగూడదని స్మృతియొక్క
అర్థము.

కౌపీనాదుల గ్రహించుటయును స్వశరీరోపభోగపరోప
కారములకొఱకే కాని అత్యర్థాపేక్షకొఱకుఁగాదు. కౌపీ
నము చేత లజ్జను, దండము చేత ప్రాణ్యుపద్రవమును ఆచ్ఛా
దనము చేత చలిని, ఎండను, పాదుకల చేత నుచ్ఛిష్టదేశస్పర్శ
మును నివారించుకొనుటయే స్వశరీరోపభోగ మని దండకా
షాయాదిచిహ్నములను జూచి తనయొక్క ఉత్తమాశ్రమమును
నిశ్చయించుకొని తనకు నమస్కారభిక్షాప్రదానాదిసత్కార
ములను చేసి లోకులు సుకృతమును పొందుటయె పరోపకార
మనియుఁ దెలియవలయును. ఇదిగాక, అనాదిశిష్టాచారప్రాప్త
మగు సన్న్యాసాశ్రమమర్యాదను పరిపాలించుటయు పరోప
కార మని తెలియవలయును.

విద్వత్సన్న్యాసికి కౌపీనాదిపరిగ్రహము అనుకల్పమే
కాని ముఖ్యము కాదని శ్రు. 'తచ్చ న ముఖ్యోఽపి' అని నిషే
ధించుచున్నది.

తా. కౌపీనదండాదులను పరిగ్రహింపవలయునని వెనుక చెప్పినది యీపరమహంససన్న్యాసికి ముఖ్యము కాదు. అముఖ్యమే యని భావము.

వివిదిషాసన్న్యాసికి మాత్రము దండకాషాయాదిగ్రహణము ముఖ్యము. కనుకనే వివిదిషాసన్న్యాసికి దండాదివియోగ మెప్పటికిని తగ దని నిషేధింపఁబడియున్నది.

శ్లో. దండాత్మనో స్తు సంయోగస్సర్వదైవ విధీయతే,
న దండేన వినా గచ్ఛే దిషుక్షేపత్రయం బుధః. ఇతి.

తా. దండముతనకును శరీరమునకును సంయోగము సన్న్యాసికి సర్వకాలములయందు కలిగియుండవలయును. దండమును విడిచి మూడు బాణములు పోయెడి మార్గమునైనా నడువఁగూడదు.

'దండత్యాగే శతం చరేత్' అని దండము వదలించితే నూఱుప్రాణాయామములను ఆచరించి ప్రాయశ్చిత్తము చేసుకొనవలయునని కూడ చెప్పియున్నది. యోగియైనపరమహంస యొక్క ముఖ్యకల్పమును ప్రశ్నోత్తరములచేత శ్రుతి చూపుచున్నది.

శ్రు. కోఽయం ముక్త ఇతి సోఽయం ముక్తో న దండం న శిఖాం న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం చరతి పరమహంసః. ఇతి.

తా. యోగియైన పరమహంససన్న్యాసికి ముఖ్యకల్పమేది యనఁగా దండమునుగాని శిఖనుగాని యజ్ఞోపవీత

మునుగాని ఆచ్ఛాదనమునుగాని ధరింపకయుండుటయే ముఖ్య
కల్పమని తెలియవలయును అని యర్థము.

విధినిషేధవ్యాప్తికి శిఖాయజ్ఞోపవీతములను విడిచియుండుట
యేప్రకారము ముఖ్యమని చెప్పబడునో, ఆప్రకారమే
యోగియునగు పరమహంసవ్యాప్తికి దండాచ్ఛాదనములను విడిచి
యుండుటయే ముఖ్యమని చెప్పబడును. తత్త్వజ్ఞానియగువాడు
విద్వత్సన్యాసమును నివారింపకపోవుటకుగదా పరమహంసా
శ్రమము నంగీకరించినను అట్టి పరమహంసాశ్రమములో దండా
చ్ఛాదనములను గ్రహింపవలసియుండినను, దండమును వెదురు
కఱ్ఱగా నుండవలయును అని ఆచ్ఛాదనము కంథగాను నుండ
వలయును అని నియమము చేయుటయందు వానిని సంపాదించుటయందు
రక్షించుటయందును చిత్తము విక్షేపమును పొందును గనుక
నది యుక్తము కాదు. 'న హి నాఘాతాయ కన్యోద్వాహః'
అని గదా లోకన్యాయము.

ఆచ్ఛాదనాదులు లేకపోతే, శీతవాతాదినివారణ
మెలాగున కలుగునంటె చెప్పబడుచున్నది.

శ్రు. న శీతం న చోష్ణం న దుఃఖం న సుఖం న మానావమానే చ షడూ
ర్మివర్జం. అని.

తా. ఏప్రకారము ఆటలయందాసక్తి కలిగియుండు
బాలకులకు ఆచ్ఛాదనము లేకపోయినా, హేమంతశిశిరర్తువుల
యొక్క ప్రాతఃకాలములయందుకూడ చలియుండదో, ఆప్రకా
రమే పరమాత్మయందాసక్తులై నిరోధింపబడిన సమస్తచిత్త
వృత్తులుగల యోగికి శీతోష్ణాదివిషయములు గోచరింపనందున

శీతోష్ణసుఖదుఃఖ మానావమానములు గలుగనేరవు. ఊర్మి షట్కమును కలుగనేరదు.

క్షుత్తు (ఆఁకలి), పిపాస (దాహము), శోకము, మోహము, జర (ముసలి), మరణము ననియాఱు ఊర్మిషట్కమనఁబడును. ఈయాఱింటిలో క్షుత్పిపాసలు ప్రాణధర్మములు. శోకమోహములు మనోధర్మములు. జరామృత్యువులు దేహధర్మములుగనుక పరిశుద్ధాత్మస్వరూపనిష్ఠుఁడగు పరమహంససన్న్యాసికి ఈమూఁడు ద్వంద్వములు కలుగ నేరవని నిశ్చయము.

సమాధియందు శీతోష్ణ మానావమానములు లేకపోయినా, వ్యుత్థానదశయందు వివేకము లేనివానివలె నీపరమహంసను కూడ నిందాక్లేశము బాధించు నని శంకింపఁగా శ్రుతి పరిహరించుచున్నది.

శ్రు. నిందాగర్వమత్సర దంభదర్పేచ్ఛాద్వేష సుఖదుఃఖ కామక్రోధలోభ
మోహహర్షాసూయాహంకారాదీంశ్చ హిత్వా.

తా. విరోధులయిన పురుషులు తనయందు దోషములనారోపించి చెప్పిన నింద. అన్యులకంటె తాను అధికుఁడని తలఁచుటగర్వము, విద్యాధనాదులచే నధికులైన వారినిజూచి తాను కూడ విద్యాధనాదులచేత వారితో సమానముగా నుండవలెననుబుద్ధి మత్సరము; ఇతరులు మెచ్చవలయునని తనయొక్క జపధ్యానాదికర్మల నితరులయెదుట నాచరించుట దంభము; ఇతరులను తర్జన భర్త్సనలచేత తిరస్కరించుట దర్పము; ధనక్షేత్రాదులయందభిలాషయే ఇచ్ఛ; శత్రువధాదులయందు బుద్ధి ద్వేషము; అనుకూలములైన ద్రవ్యగృహక్షేత్రాదులయొక్క

ప్ర.

ఇప్పుడు తద్విషయము సర్వానుభవసిద్ధమైనందున సర్వవేదాంతప్రసిద్ధమైన పరమాత్మను చెప్పుచున్నది. ఆపరమాత్మయందనిత్యమై అవిచ్ఛిన్నమైన జ్ఞానముగలవాఁడై *'తన్నిత్యబోధః' అని చెప్పఁబడుచున్నాఁడు. యోగీశ్వరుఁడు పరమహంస 'తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః' అనుశ్రుతి ననుసరించి యోగాభ్యాసముచేత చిత్తవిక్షేపముల నన్నిఁటిని నివర్తింపఁ జేసికొని నిరంతరముగా పరమాత్మవిషయమగు జ్ఞానము గలవాఁడై యుండును. కనుక జ్ఞానము నిత్యముగా నున్నందున జ్ఞానముచేతఁ జేయఁబడిన యజ్ఞానతద్వాసనానివృత్తియును నిత్యముగా నుండునని తాత్పర్యము.

ఇఁకను వేదాంతమతమున 'భావాంతరమభావోన్యో నకశ్చి దనిరూపణాత్' అనున్యాయప్రకారము ఘటముయొక్క కారణద్రవ్యమైన మృత్పిండము ప్రాగభావమని, ఉత్తరావస్థయైనకపాలములు ప్రధ్వంసాభావమని చెప్పఁబడియున్నందున, అభావమనఁగా మరియొక భావపదార్థమే కాని మరియొకటి గాదని యంగీకరించియున్నందున రజ్జువునం దారోపింపఁబడిన సర్పముయొక్క నివృత్తి రజ్జుస్వరూపముగానేయున్నందున 'అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః' అనున్యా

* వేదాంతమహావాక్యశ్రవణమువలన పరమాత్మను చక్కఁగా తెలిసికొని తరువాత నిదిధ్యాసనము చేసి ప్రత్యక్షముగా తెలిసికొనవలయునని శ్రుత్యర్థము.

యమువలనను బ్రహ్మయం దారోపింపఁబడిన అజ్ఞానకా ర్యములయొక్క నివృత్తి బ్రహ్మస్వరూపముగానే యున్నది గనుక అది నిత్యమని చెప్పుట నియుక్తము.

ఉ — వేదాంతమహావాక్యవ్యాఖ్యానములచేఁ దెలియఁ బడుచున్నపరమాత్మ తార్కికులచేతఁ జెప్పఁబడిన యీశ్వరునివలె జీవులకంటె భిన్నుఁడా? యను శంకను నిరాకరించుచున్నది.

శ్రు. వేద్యమహమస్మీతి. ౨౧.

తా. యోగియైన నేనుమాత్రము వేదాంతవేద్యమైన పరబ్రహ్మమేది కలదో అది నేనే కాని నాకంటె భిన్నమైనది లేదని నిశ్చయించుకొనును అని యర్థము.

అ — యోగియొక్క బ్రహ్మానుభవప్రకారము చూపఁబడుచున్నది.

శ్రు. తం శాంతమచలమద్వయానందవిగ్రహం [illegible] ధామ. ౨౨.

తా. 'తం, శాంతం, అచలం' అను మూఁడుపదములయందు ద్వితీయావిభక్తిని ప్రథమావిభక్తిగా నన్వయించవలయును. కామక్రోధాదివికారము లేనిదై గమనాగమనాదిక్రియాశూన్యమై సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమై అఖండసచ్చిదానందరూపమయిన యేపరమాత్మ కలదో అపరమాత్మ నేనే. పరమాత్మతత్త్వమే నాయొక్క వాస్తవస్వరూపముగాని కర్తృత్వభోక్తృత్వాదివికారములుగలస్వరూపముగాదు. వికారవంతమైనస్వరూపము మాయాకల్పితము.

జీవాత్మకు పరమానందస్వరూపప్రాప్తి కలుగ నేరదని తెలియఁ దగినది.

అ.— యోగియొక్క ప్రాణస్నేహబంధువు లయిన గురువు తండ్రి సోదరులు మొదలగువారు కర్మలయం దత్యం తశ్రద్ధగలవారైయుండి, శిఖాయజ్ఞోపవీతసంధ్యావందనాది రాహిత్యముచేత నితనియందు పాషండత్వము నారోపించి వ్యామోహమును పొందించుచుండగా ఆవ్యామోహము నివర్తించుకొరకు యోగికి కలిగియుండు నిశ్చయమును చెప్పు చున్నది.

స్రు. తదేవ చ శిఖా [illegible] తదేవోపవీతం చ [illegible]
[illegible]

తా. ఈయోగికి, వేదాంతవాక్యములవలన బ్రహ్మయొ క్క తత్త్వజ్ఞానమే [illegible] కర్మాంగములైన బాహ్య శిఖాయజ్ఞోపవీతములుగా నున్నది. కర్మాంగభూతములైన యా జ్యప్రయోజనకార్యదేవమంత్రములును చరుప్రయోజనకార్యద్ర వ్యములును బ్రహ్మతత్త్వజ్ఞానమే యని నిశ్చయము. విషయా నందము లన్నియు బ్రహ్మానందాంతర్భూతములైనందున శిఖా యజ్ఞోపవీతాదిసాధ్యములైన కర్మలచేత కలుగు స్వర్గాదిసు ఖము లన్నియు బ్రహ్మజ్ఞానముచేతనే కలుగుచున్నవి అని తాత్పర్యము.

'ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి' యనుశ్రుతి యిందుకు ప్రమాణము. ఈ పరమానంద స్వరూపుఁడయిన పరమాత్మ యొక్క స్వల్పాంశమును అవలంబించి దేవతిర్యఙ్మనుష్యాది భూతములు సుఖము ననుభవించుచున్నవి యని శ్రుత్యర్థము.

ఇట్టి యభిప్రాయముతోనే ఆథర్వణికులు బ్రహ్మోపనిషత్తులో చెప్పియున్నారు.

శ్రు. సశిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః,
యదక్షరం పరం బ్రహ్మ తత్సూత్రమితి ధారయేత్.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానముగల పురుషుఁడు శిఖతోఁగూడ క్షౌరమును చేసుకొని బాహ్యముగనుండు యజ్ఞోపవీతమును త్యజింపవలయును. వినాశము లేక నిత్యముగానుండు పరమాత్మనే బ్రహ్మసూత్రముగా ధరించవలయును.

శ్రు. సూచనాత్సూత్రమిత్యాహు స్సూత్రం నామ పరం పదం,
తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః.

తా. సమస్తార్థములను సూచించుటచేత సూత్రమని పెద్దలు చెప్పెదరు. అట్టి సమస్తార్థసూచకమయిన సూత్రము పరమాత్మ స్వరూపమేగాని మరియొకటి గాదు. అట్టిసూత్రమును ఏ బ్రాహ్మణుఁడు తెలియఁగునో అతఁడు సమస్తవేదముల యొక్క అంతమును ఎఱిఁగినవాఁడని చెప్పఁబడును.

శ్రు. యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
తత్సూత్రం ధారయేద్యోగీ యోగవిత్తత్త్వదర్శివా౯.

తా. పరమగతిప్రాపకమయిన యే బ్రహ్మతత్త్వజ్ఞానము కలదో, అదియె యజ్ఞోపవీతము. కనుకనే బ్రహ్మజ్ఞానము గలవాఁడే యజ్ఞోపవీతము కలవాఁడని చెప్పఁబడును. ప్రాజ్ఞులగువా రతనినే సకలయజ్ఞములు చేసినవాఁ డని చెప్పుదురు.

కనుక యోగికి శిఖాయజ్ఞోపవీతములు కలవు. ఆప్రకారమే సంధ్యయు కలదు. అహంప్రత్యయముచేత తెలియఁబడు జీవాత్మను కేవలశాస్త్రముచేతనే తెలియఁబడు పరమాత్మను భ్రాంతిచేత కలిగియున్న భేదము తత్త్వమస్యాదిమహావాక్యజన్యమైన అభేదజ్ఞానముచేత తిరిగి పుట్టకుండ నశించును. ఈయభేదజ్ఞానము జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁ గలుగును గనుక సంధ్య యనఁబడును. అహోరాత్రములు రెంటియొక్క సంధియందుఁ గలుగు క్రియయే కదా సంధ్యయనఁబడునది. అహోరాత్రములయొక్క సంధియందుఁ గలిగిన క్రియ సంధ్య యని చెప్పఁబడినట్లు జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁగలిగిన అద్వైతజ్ఞానము సంధ్యయని చెప్పఁబడును. ఈప్రకారము పరమహంసను కూడ శిఖాయజ్ఞోపవీతసంధ్యలు కలిగియున్నందున యోగి యగువాఁడు శిష్యజనులచేత వ్యామోహమును పొందించుటకు శక్యుఁడు కాఁడు.

ఈప్రకారము పరమహంసయొక్కమార్గస్థితులను గూర్చి చేసిన ప్రశ్నలకు ప్రత్యుత్తరమును చెప్పి యిప్పుడు సమాప్తి చేయఁబడుచున్నది.

నుడైనవాఁడు పరాన్నభక్షణముచేత పతనమును బొందుట యుక్తముగానే యున్నది.

కనుకనే జ్ఞానహీనుఁడైన సన్న్యాసికి భిక్షానియమము మనుస్మృతియందు చెప్పఁబడియున్నది.

శ్లో. న చోత్పాతనిమిత్తాభ్యాం న నక్షత్రాంగవిద్యయా,
నానుశాసనవాదాభ్యాం భిక్షాం లిప్సేత కర్హిచిత్.
ఏకకాలం చరేద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే.
భైక్షే ప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి.

తా. కేవలసన్న్యాసియగువాఁడు ఉత్పాతములనుగాని శకునములనుగాని జ్యోతిషములనుగాని జనులకు చెప్పి భిక్షను పొందఁగూడదు. హితోపదేశమును చేసి గాని శాస్త్రవాదములను చేసి తన పాండిత్యమును ప్రకటనచేసి గాని భిక్షను పొందవలయుఁగూడదు. ప్రతిదినమును నొకపర్యాయము మాత్రము భిక్షను చేయవలయునే గాని రెండుమూఁడుపర్యాయములు చేయఁగూడదు. విస్తారముగా భిక్షయందాసక్తిగల సన్న్యాసి విషయములయందుఁ గూడ నాసక్తి కలవాఁడై చెడిపోవును.

శ్రవణాదులచేత తత్వజ్ఞానము నభ్యసించు సన్న్యాసికి భిక్షాక్రమము మరియొక ప్రకారముగా చెప్పఁబడియున్నది.

శ్లో. ఏకకాలం ద్వికాలం వా భుంజీత పరహంసకః,
యేన కేన ప్రకారేణ జ్ఞానాభ్యాసీ భవేత్సదా.

తా. ఒకపర్యాయము గాని రెండుపర్యాయములు గాని పరమహంససన్న్యాసి భిక్షను చేయవచ్చును. తత్త్వజ్ఞా

ప్రమాతలను ప్రకాశింపఁజేయుసాక్షిచైతన్యము తత్త్వమసి యను మహావాక్యములోని త్వంపదమునకు లక్ష్యార్థమై యున్నది. దేహేంద్రియాదివిశిష్టమైన చైతన్యము త్వంపదమునకు వాచ్యమే కాని లక్ష్యము గాదు. అట్టివాచ్యము తత్పదార్థముకంటె భిన్నము. లక్ష్యము అభిన్నము. స్వదేహనిష్ఠమయిన త్వంపదవాచ్యార్థము అహం (నేను) అని చెప్పఁబడును. పరదేహనిష్ఠమైన త్వంపదవాచ్యార్థము త్వం (నీవు) అని చెప్పఁబడును. లక్ష్యమని వాచ్యమని చెప్పఁబడు ఉభయవిధచైతన్యరూపమై జడమైన ప్రపంచము సర్వమని చెప్పఁబడును. ఇట్టి లక్ష్యలక్ష్యవిజ్ఞానశాస్త్రవ్యవహారములలో నొకటికూడ బ్రహ్మయందు విశ్రాంతమైన చిత్తముగలయోగికి సంభవింపనేరదు. కనుకనే యాపరమహంసగృహమందు నివసించువాఁడు కాఁడు. నియతముగా నివసించుటకొరకొక మఠమును కల్పించుకొని యుండెనా! యామఠమందు, మమకారము గలిగి దానియొక్క హానివృద్ధులచేత చిత్తము విక్షేపము నొందుచుండును.

ఈయభిప్రాయముతోనే శ్రీగౌడపాదాచార్యులవారు చెప్పియున్నారు.

శ్లో. నిస్తుతిర్నిర్నమస్కారో నిస్స్వధాకార ఏవ చ,
చలాచలనికేతశ్చ యతిర్యాదృచ్ఛికో భవేత్.

తా. పరమహంసపరివ్రాజకుఁడు స్తుతి నమస్కారస్వధాకారములు లేనివాఁడుగాను, నియతనివాసము లేనివాఁడుగాను, యాదృచ్ఛికవృత్తిగలవాఁడుగాను నుండవలయు నని భావము.

మతము ఏప్రకారము పరిగ్రహింపఁదగదో, ఆప్రకారమే సువర్ణరజతకాంస్యతామ్రాదిపాత్రలను భోజనాచమనాదులయందు ఉపయోగించుకొనఁదగదు.

ఈయర్థము స్మృతిలో చెప్పఁబడియున్నది.

శ్లో. హిరణ్మయాని పాత్రాణి తామ్రాణి రజతాని చ,
యతీనాం తాన్యపాత్రాణి వర్జయేత్తాని భిక్షుకః.

తా. సువర్ణపాత్రలు, ఇనుము, ఉక్కు మొదలయిన పాత్రలు సన్న్యాసులకు భోజనపాత్రలుగా నుండఁగూడదు.

సువర్ణాదిపాత్రలను సన్న్యాసి వర్జింపవలయును అని మనుస్మృతియందు కూడ చెప్పఁబడియున్నది.

శ్లో. అతైజసాని పాత్రాణి యతీనాం నిర్వ్రణాని చ,
తేషా మద్భిః స్మృతం శౌచం చమసానామివాధ్వరే.
అలాబుం దారుపాత్రం చ మృణ్మయం వైదళం తథా,
ఏతాని యతిపాత్రాణి మనుః స్వాయంభువోఽబ్రవీత్.

తా. సువర్ణాదిలోహములతోఁ జేయఁబడినవియు బుడుపులు లేనివియు అయినపాత్రములను సన్న్యాసులు గ్రహింపవలయును. ఇట్టిపాత్రలను యాగమందు చమసము లనుసోమపాత్రలకు ఉచ్ఛిష్టస్పర్శమందు జలమువలననే శుద్ధి కలుగునటుల కేవలజలముచేతనే శుద్ధి కలుగును. కనుకనే సొరకాయబుఱ్ఱనైనా, కొయ్యతోఁ జేయఁబడిన పాత్రమునైనా వెదురుగొట్టమునైనా సన్యాసి గ్రహింపవలయునని స్వాయంభువమనువుచే చెప్పఁబడినది.

భోధాయనమహర్షియు నీప్రకారముగానే చెప్పియున్నారు.

శ్లో. స్వయమాహృతపర్ణేషు స్వయంశీర్ణేషు వా పునః,
భుంజీత న వటాశ్వత్థకరంజానాం చ పర్ణకే.

తా. స్వయముగా తెచ్చుకొన్న పత్రములయందుఁగాని స్వయముగా క్రిందరాలినపత్రములయందుఁగాని సన్యాసి భోజనమును చేయవలసినది. మఱ్ఱియాకులయందుఁగాని, రావియాకులయందుఁగాని, కానుగాకులయందుఁగాని భోజనము చేయఁగూడదు.

శ్లో. అపద్యపి న కాంస్యేషు మలాశీ కాంస్యభోజనః,
సౌవర్ణే రాజతే తామ్రే మృణ్మయే త్రపుసీసయోః.

ఆపత్కాలమందైనా ఈసన్యాసి కంచు బంగారు వెండి రాగి మృత్తు సత్తు సీసము ఈపాత్రలయందు భోజనము చేయఁగూడదు. చేసెనో మలమును భక్షించినవాఁడగును.

ఈప్రకారమే లోకమును (శిష్యవర్గమును) పరిగ్రహించఁగూడదు.

ఇది మనువుచేఁ జెప్పఁబడినది.

శ్లో. ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థమసహాయకః,
సిద్ధిమేకస్య పశ్యన్ హి న జహాతి న హీయతే.

తా. సన్యాసి యొంటరిగా నుండి తత్త్వజ్ఞానసిద్ధికొఱకు అసహాయముగా సంచరించవలయును. ఏకాకిగా నుండువానికి జ్ఞానసిద్ధి కలుగుటను చూచి ఇతరసహాయమును విడుచును. ఆప్రకార మితరసంగమును విడిచినందున హాని లేదు.

ఈ విషయము మేధాతిథి యను మహర్షియును చెప్పియున్నారు.

శ్లో. ఆసనం పాత్రలోపశ్చ సంచయశ్శిష్యసంగ్రహః,
దివాస్వాపో వృథాలాపో యతేర్బంధకరాణి షట్.

తా. ఆసనము, పాత్రలోపము, సంచయము, శిష్యసంగ్రహము, దివాస్వాపము, వృథాలాపము అను నీయాఱును సన్న్యాసికి బంధకములు.

ఈ చెప్పిన యాఱుదోషములయొక్క స్వభావము ఆ ఋషిచేతనే వివరింపఁబడెను.

శ్లో. ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే,
వర్షాభ్యోఽన్యత్ర యత్స్థాన మాసనం తదుదాహృతం.

తా. గ్రామములో నొకదినముకంటె పట్టణములో నైదుదినములకంటె నధికకాలము నిలువకను వర్షాకాలము నాలుగు మాసములలోతప్ప నితరకాలములయం దొకచోట విశేషకాలము నిలుచుటయును ఆసనమనఁబడును.

శ్లో. ఉక్తాలాబ్వాదిపాత్రాణా మేకస్యాపి న సంగ్రహః,
భిక్షోర్భైక్ష్యభుజశ్చాపి పాత్రలోపస్స ఉచ్యతే.

తా. సన్న్యాసి యగువాఁడు భిక్షాన్నమును భుజించుచున్నప్పటికి శాస్త్రమందు విధించిన సొరకాయబుఱ్ఱ మొదలైన పాత్రలలో నొకదానినైనా గ్రహింపకపోవుట పాత్రలోపమని చెప్పఁబడును.

శ్లో. గృహీతస్య తు దండాదే ర్ద్వితీయస్య పరిగ్రహః,
కాలాంతరోపభోగార్థం సంచయః పరికీర్తితః.

తా. దండకాషాయాదులను పరిగ్రహించి అవి ఖిలమైన తరువాత తిరిగి ధరించుటకుగాను రెండుమూఁడుదండములను కాషాయములను సంపాదించి పెట్టుకొనుట సంచయ మనఁబడును.

శ్లో. శుశ్రూషాలాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః,
శిష్యాణాం న తు కారుణ్యాత్ స జ్ఞేయశ్శిష్యసంగ్రహః.

తా. శుశ్రూష, లాభము, పూజ, కీర్తి వీటిని అపేక్షించి శిష్యులను చేర్చుకొనుట శిష్యసంగ్రహ మనఁబడును. కేవల దయచేత శిష్యులను కృతార్థులను చేయవలయు ననెడి యిచ్ఛ చేత చేర్చుకొనుట శిష్యసంగ్రహ మని చెప్పఁబడదు.

శ్లో. విద్యా దివం ప్రకాశత్వా దవిద్యా రాత్రి రుచ్యతే,
విద్యాభ్యాసే ప్రమాదో యస్స దివాస్వాప ఉచ్యతే.

తా. బ్రహ్మజ్ఞానము ప్రకాశస్వరూపమైనందున దివా (పగలు) అని చెప్పఁబడును. అజ్ఞానము అప్రకాశమైనందున రాత్రి యనఁబడును. జ్ఞానమనెడి పగటియందు ప్రమాదము గలిగియుండుటయె దివాస్వాప మనఁబడును.

శ్లో. ఆధ్యాత్మికీం కథాం ముక్త్వా భైక్ష్యచర్యాం గురుస్తుతిం,
అనుగ్రహప్రైషప్రశ్నౌ వృథాలాప స్స ఉచ్యతే.

తా. అధ్యాత్మవిషయమైన కథలను దేహధారణార్థమై నభిక్షాచరణమునందు 'భిక్షాం దేహి' యను శబ్దోచ్చారణమును పరమేశ్వరస్తవమును వీటిని మాత్రము సన్న్యాసి చేయవలయును. వీటికంటె నితరములైన దారిసమాచారములను అనుగ్రహముచేతనడిగినా, అదివృథాలాపమని చెప్పఁబడును. శిష్య

జనరూపమైన లోకమును పరిగ్రహింపఁదగదని చెప్పఁబడిన శిష్యజనమును పరిగ్రహింపక యుండుటమాత్రమే కాదు. అట్టి వారి యవలోకనమునుగూడఁ జేయఁగూడదని తెలియవలయును. ఈశిష్యులు ఖ్యాతిలాభపూజాసంపాదనమూలమైనందున బంధహేతువులే గాని తత్త్వజ్ఞానానుకూలవృత్తి కలవారు కారు. అంతమునందుండు చకారముచేత మఱికొన్ని శ్రుతినిషిద్ధములను గూడ నాచరింపఁదగదని సూచింపఁబడుచున్నది.

వానిని మేధాతిథియే కనుపఱచియున్నాడు.

శ్లో. స్థావరం జంగమం బీజం తైజసం విషమాయుధం,
షడేతాని న గృహ్ణీయా ద్యతిర్మూత్రపురీషవత్.

తా. గృహక్షేత్రాదిస్థావరములను, శిష్యాదిజంగమములను, యవగోధూమాదిధాన్యములను, కాంస్యాదిలోహములను విషయమును అనఁగా దోషకములను ఖడ్గాద్యాయుధములను వీనినారింటిని మూత్రపురీషములవలె సన్న్యాసి సంపాదించి పరిగ్రహింపఁగూడదు.

శ్లో. రసాయనం క్రియావాదం జ్యోతిషం క్రయవిక్రయం,
వివిధాని చ శిల్పాని వర్జయేత్పరదారవత్.

తా. రసాయనాది విద్యావధప్రయోగమును సువర్ణరజతాది నిర్మాణకౌశలమును భూతభవిష్యద్వర్తమానములను చెప్పు జ్యోతిషశాస్త్రమును క్రయవిక్రయాదివ్యవహారములను పలువిధములగు శిల్పములను వీనిని పరస్త్రీని త్యజించినట్లు త్యజించవలయును.

వా. ఇంతవరకు యోగ్యుడైన పరమహంసకు వైదికలౌకిక వ్యాపారములయందుండు బాధకములను గనుపఱచి వాటిని విడువవలయు నని చెప్పఁబడినది.

అ.—ఇకఁ బరము సర్వప్రకారములచేత బాధకములైనవాటిని ప్రశ్నోత్తరములచేతఁ జూపించి వాటిని విడువవలయు నని యీశ్రుతి చెప్పుచున్నది.

శ్రు. అబాధకం క్వచిత్, అబాధకోఽస్త్యేవ. యస్తు భిక్షుర్హిరణ్యం రసేన దృష్టం చేత్స బ్రహ్మహా భవేత్. యస్తు భిక్షుర్హిరణ్యం రసేన స్పృష్టం చేత్స పౌల్కసో భవేత్. యస్తు భిక్షుర్హిరణ్యం రసేన గ్రాహ్యం చేత్స ఆత్మహా భవేత్. తస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన న దృష్టం న స్పృష్టం న గ్రాహ్యం చేతి.

తా. యోగ్యుడైన పరమహంససన్యాసికి మిక్కిలి బాధకమైనది యేదిగా నుండు ననఁగా మిక్కిలిబాధకమైనది యొకటి కలదు. అది సువర్ణము. సువర్ణమును ఆసక్తితో సన్యాసిచూచెనా! బ్రహ్మహత్య కలవాఁ డగును. సువర్ణమందుండు నాసక్తిచేత దానిని సంపాదించుటయందు, రక్షించుటయందు నెప్పటికి ప్రయత్నముచేయుచు, అసంపాదనరతూ ప్రయత్నములయొక్క వ్యర్థత్వశంకను పరిహరించుకొరకు ప్రపంచమిథ్యాత్వబోధకములైన వేదాంతవాక్యములను దూషించి, ప్రపంచసత్యత్వమును ప్రతిపాదింపుచుండును. అందుచేత శాస్త్రసిద్ధమైన అద్వితీయబ్రహ్మస్వరూపము ఆసన్యాసిచేత నశింపఁజేయఁబడును గనుక నాసన్యాసి బ్రహ్మహత్య చేసినవాఁడనే చెప్పఁదగును.

ఈయర్థ మొకస్మృతిలోఁ జెప్పఁబడియున్నది.

శ్లో. బ్రహ్మ నాస్తీతి యో బ్రూయాత్ ద్వేష్టి బ్రహ్మవిదం చ యః,
అభూతబ్రహ్మవాదీ చ త్రయస్తే బ్రహ్మఘాతకాః,
బ్రహ్మఘ్నాశ్చ తు విజ్ఞేయాస్సర్వధర్మబహిష్కృతాః.

తా. పరబ్రహ్మ లేఁడని యెవఁడు చెప్పునో, బ్రహ్మవేత్తతో నెవఁడు విరోధించునో, బ్రహ్మస్వరూపము శాస్త్రములోఁ జెప్పినప్రకారముగా కాకుండ మఱియొకవిధముగా నెవఁడు నిరూపించునో, వీరు ముగ్గురు బ్రహ్మఘాతుకు లని చెప్పఁబడుదురు. ఈబ్రహ్మఘాతుకుఁడు సర్వధర్మములనుండి బహిష్కృతుఁడై యీలోకములో నిందింపఁబడుచు పరలోకమున కయోగ్యుఁడై చెడిపోవును. అభిలాషపూర్వకముగా సువర్ణమును స్పృశించినయెడల సన్యాసి పతితుఁడై మ్లేచ్ఛసమానుఁడై పోవును.

ఈయర్థము స్మరింపఁబడుచున్నది.

శ్లో. పతత్యసౌ ధ్రువం భిక్షుర్యస్య భిక్షోర్ద్వయం భవేత్,
ధీపూర్వం రేతఉత్సర్గో ద్రవ్యసంగ్రహ ఏవ చ.

తా. ఏసన్యాసి బుద్ధిపూర్వకముగా రేతస్సును విడుచునో, సువర్ణమును సంగ్రహించునో, ఆసన్యాసి నిశ్చయముగా పతితుఁ డౌను.

ఆసక్తిపూర్వకముగా సువర్ణమును గ్రహింపఁగూడదు. గ్రహించెనో, అట్టియాసన్యాసి దేహేంద్రియాదిసాక్షియై యసంగుఁడై సచిదాత్మను చంపిన వాఁడగును. ఆత్మయొక్క అసంగత్వమును మఱచి సువర్ణాదిద్రవ్యమునుగూర్చి ఆత్మ భోక్త

యంగీకరించినందున ఆత్మహత్యచేసినవాఁ డని చెప్పఁబడు ను. ఇట్టి అన్యథాప్రతిపత్తి సర్వపాపస్వరూప మని మహా భారతములో శకుంతలాదుష్యంతసంవాదములోఁ జెప్పఁబడి యున్నది.

శ్లో. అన్యథాసంతమాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే,
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా.

తా. ఒకప్రకారముగా నున్న యాత్మస్వరూపమును మరియొకప్రకారముగా నెవ్వఁడు తలఁచునో, అట్టి ఆత్మాపహారము చేసిన చోరుఁడు ఏపాపమును జేయనివాఁడుగా నుండును? అనఁగా సర్వపాపములను జేసినవాఁడే యని యర్థము.

అదిగాక యాత్మహత్యచేసినవానికి సుఖలేశము కూడ లేక నానావిధదుఃఖపూర్ణము లైన లోకములు ప్రాప్యములుగా నుండు నని యొకశ్రుతిచేఁ జెప్పఁబడుచున్నది.

శ్రు. అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః,
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కేచాత్మహనో జనాః.

తా. ఆత్మ నన్యథాప్రతిపత్తిచే నశింపఁజేసిన పురుషులు గాఢాంధకారముచే నావరింపఁబడిన అసుర్యములను పేరుగల పాపలోకములను పొందుదురు. దృష్టస్పృష్టగ్రాహ్యశబ్దములతో క్రమముగా సంబంధించిన చకారత్రయమునకు శ్రుతకథితవ్యవహృతము లర్థము. సువర్ణముయొక్క దర్శనస్పర్శనగ్రహణములు సన్యాసికి ప్రత్యవాయకరము లైనటులసాభిలాషముగా సువర్ణముయొక్కవృత్తాంతమును వినుటయును

దాని గుణములను కీర్తించుటయును సువర్ణమును క్రయవిక్రయాదులచేత వ్యవహరించుటయును ప్రత్యవాయకరములని తాత్పర్యము. సన్న్యాసికి సువర్ణదర్శనాదులు దోషసంపాదకములు గనుక వానిని సన్న్యాసి ప్రయత్నపూర్వకముగా పరిహరించవలయు నని సముదాయతాత్పర్యము.

సువర్ణమును త్యజించినందువలన విశేషఫలమును చెప్పుచున్నది.

శ్రు. సర్వే కామా మనోగతా వ్యావర్తన్తే; దుఃఖేషూద్విగ్నస్సుఖే
ష్వస్పృహస్త్యాగే రాగే సర్వత్ర శుభాశుభేష్వనభిస్నేహో
న ద్వేష్టి న మోదతే చ సర్వేషామిన్ద్రియాణాం గతిరుపరమతే య
ఆత్మన్యేవావస్థీయతే.

టీ. పుత్త్రభార్యాగృహక్షేత్రాదికామములు అన్నియు సువర్ణమూలములు గనుక సువర్ణమును పరిత్యజించఁగా మనోగతములైన యీ కామములన్నియు పరిత్యజింపఁబడును. కామములను పరిత్యజించఁగా కామముచేత ప్రాప్తించు సుఖమునం దభిలాషయును దుఃఖమునం దుద్వేగమును గలుగనేరదు. సుఖదుఃఖములయం దభిలాషోద్వేగములు సంభవింపనేర వను నర్థము స్థితప్రజ్ఞలక్షణమును చెప్పునప్పుడు విస్తారముగా నుపపాదించి యున్నారము. ఐహికసుఖదుఃఖములను విడువఁగా నాముష్మికసుఖమునందు రాగమును విడువఁబడును. ఐహికసుఖాభిలాషగలపురుషుఁడే యాముష్మికసుఖమును కోరుచుం

డును. కనుక నైహికమందు నిస్పృహగలవాఁడు ఆముష్మిక సుఖములయందును నిస్పృహగలవాఁడై యుండు నని చెప్పుట యుక్తముగానే యున్నది. ఇందువలన నిహాలోక పర లోకములయం దుండు శుభాశుభ విషయములయందు స్నే హము లేనివాఁడై యుండును. ద్వేషముకూడ లేకనే యుండును. ఇటువంటి మహాపురుషుఁడు తనయందు ప్రతికూల ముగా ప్రవర్తించువానివిషయమై ద్వేషమునుగాని అను కూలముగా ప్రవర్తించువానివిషయమై మోదమును గాని పొందఁడు. ద్వేషమోదములు లేనివాఁడై యేపురుషుఁడు పర మాత్మయందే నిరంతరనిష్ఠగలవాఁడై యుండునో ఆపురుషునకు సర్వేంద్రియములు ప్రవృత్తిశూన్యములై యేకాగ్రతనొంది యుండును. ఇంద్రియము లేకాగ్రత నొందుటవలన నిర్వికల్ప సమాధికి విఘ్నమెప్పుడు కలుగనేరదు.

ఇఁకను శ్రుతి విద్వత్సన్న్యాసము నిగమించుచున్నది.

శ్రు. యఃపూర్ణానందైకబోధ స్తద్బ్రహ్మాహమస్మీతి కృతకృత్యో భవతి.

తా. ఏపరబ్రహ్మ వేదాంతములయందు పూర్ణానందజ్ఞాన స్వరూపుఁడని, పరమాత్మయని ప్రతిపాదింపఁబడియున్నదో, ఆబ్రహ్మను నేనే యని సర్వదా అనుభవించుచుండు యోగి యైన యీపరమహంససన్న్యాసి కృతకృత్యుఁడై యుండెను.

ఈయర్థము స్మృతియందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్.